# పీఠిక.

నామిత్రుడు శ్రీకొవ్వలి వేంకటస్వా[illegible] గారు రచియించిన శ్రీభగీరథీ శతకము మిక్కిలి చక్కనైన శైలితోనలరుచున్నది. అందు వారి స్వానుభవములైన గంభీరభావములు పెక్కుగలవు. శతకరచన, ప్రాచీనకవుల ననుకరించుట వారి భక్తిపారవశ్యతయే కారణము. భాగీరథివలె కవితాధార ప్రవాహముగా ప్రవహించుచు, చదువరులకు చల్లదనమొసంగుచు, సకలజనపావనకరంబై యలరుచున్నది. భగీరథి యను గ్రామదేవతనుఁ గూర్చి సంబోధించుచు, చక్కని భక్తిరసము, నీతి, లోకసాంప్రదాయము, వేదాంతవిషయము, మున్నగు ననేక పద్ధతులుగా రచియించినందున పాఠకులకు భక్తి, రక్తి, ముక్తి యనునట్లు సకలామోదముఁ గలిగించుననుటకు సందియము లేదు. వీరు ఆధునికపద్ధతిగా బిరుదులనుపొందఁ దగిన గొప్ప విద్వాంసులుఁ గాకున్నను, ప్రాచీనపద్ధతులు, పురాణసాంప్రదాయము లెఱింగిన స్వభావసిద్ధమైన కవితాధారకలిగి, చక్కని సంగీత రసానుభవ మెఱింగిన కవులగుటచే నిందలిపద్యము లింతమృదు మధురముగా నుండుటకు కారణమని చదువరులకు వేరుగాఁ జెప్పనక్కరలేదు. నేటికాలమున గ్రంథరచన శ్రమకన్నను, గ్రంథముద్రణకై వడు శ్రమ మెక్కువయగుటకు దేశభాషాభిమానహీనతయే కారణము. ప్రాచీన మహాకవుల మహా

త్తరమైన యనేక గ్రంథము లింక నముద్రితము లుండఁగా చెదపురుగుల పాలుచేసి యూరకుండుట దేశదౌర్భాగ్యము గాదా! దేశకాలపాత్రాదులచే మఱల భాషాభివృద్ధి యగు గాక! ప్రస్తుతకాలమున దేవబ్రాహ్మణభక్తికలిగి, దేశభాషాభిమానమున నిట్టిసత్కృతియను శతకరత్నమునుఁ బ్రకటించిన శ్రీజోడా అప్పలనరసింహశ్రేష్ఠి సుకృతి నెంతయునుఁ గృతజ్ఞుఁడ. సకలశ్రేయోభివృద్ధియగు నీశతకంబు నెల్లరుం గైకొని, గ్రంథకర్తను కృతార్థుం జేయుదురని నమ్ముచున్నాను. వీరికి భగవంతుఁ డాయురారోగ్యైశ్వర్యాదు లొసంగి సదారక్షించుగాక!

సత్యవోలు రాధామాధవరావు.
సంగీతసాహిత్యవిద్వాన్,

కొత్తపల్లి, పిఠాపురం.
ది 15-8-1932

## శ్రీ సత్పరదేవతాయై నమః

తే॥ గీ॥ శ్రీకరుండును భక్తవశీకరుండు
నాదిమధ్యాంత రహితుఁ డంభోధితనయ
నెలమి చేపట్టినట్టి హరిన్ దలఁతు
శ్రీమదప్పలనరసింహ శ్రేష్ఠిఁ గావ॥

కం॥ అరిశిష్టగోత్రజుఁడు హరి
చరణాంబుజ భక్తుఁ డమల చరితుఁడు విశ్వం
భరలో బోడా నంశ్యుఁడు
వరలెన్ లచ్చయ్య సకల వైశ్యాగ్రిణినాన్॥

తే॥ గీ॥ అతనికి జనించె సుబ్బరాయాహ్వయుఁడు దైవ
భక్తి బ్రాహ్మణ భక్తియుఁ బ్రబలియుండ
సజ్జనుండితఁడని జనుల్ సన్నుతింప
నవనిలోపల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె॥

కం॥ అతనికి మామిళ్ళాఖ్యుఁడు
సుతుఁడొక డుదయించె వినుత సుగుణుఁడు సత్య
వ్రతుఁడు హరికీర్తనా పరుఁ
డతులయశుండనఁగఁ బరఁగె నవనీస్థలిలోన్॥

కం॥ మామిళ్ళయ్యకుఁ దనయుఁడు
మామహిళాధవ పదాబ్జ మందిరహృదయుం
డీమహిని వేంకయాఖ్యుఁడు
ధీమహితుఁడు దానపరుఁడు ధీరుఁడు ఘట్టెన్॥

తే॥ గీ॥ అతఁడు కడు భక్తితోడ నిరతమునాంధ్ర
భారతము సాంతముగఁ బెక్కు సారులు విని
విప్రసంతర్పణము చేసె వేక్కు మాచ
వరమునందలి వేణుగోపాల దేవు
సన్నిధిని నిల్పె నొగి ధ్వజస్తంభ మొకటి॥

గీ॥ చతురమతియైన వెంకయ సత్యవమాంబఁ
బెండ్లియాడి యామెనుఁ గూడి ప్రియసుఖంబు
లంది యప్పల నరసింహ నామెడి తనయుఁ
గాంచె నెంతయు లోక విఖ్యాత యశుని॥

గీ॥ ఆతఁడనుకూలవతి రూపవతిని సుగుణ
వతిని శేషాంబఁ బత్నిగా నతి ముదమునఁ
బడసి యాసతి యందు విస్ఫారగుణుల
సుతుల నాల్గుర నేవుర సుతలఁ గనియె॥

సీ॥ ఆయాఱుగురు సూను లనుల గుణోపేతు
లందు వెంకటరాజు ముందుఁ బుట్టె
విశ్వనాథము లోక విశ్వాసి రామమూ
ర్తి స్వామి యును వినుతింపఁ దగిన
మల్లికార్జునుఁడు సోమమూర్తి సూర్యనా
రాయణమూర్త్యాఖ్యులై మనంగ
సరస వాగ్రచన సజ్జనగోష్ఠిఁ జెలువరా
తిన్నయప్పైఁ గూర్చున్న సభను॥

గీ॥ వెలసి, సత్సంతతియును లక్ష్మీ కటాక్ష
మహిమనుఁ జెందియుఁ బలుగుర్తి మాచవరపు
లీలలాభంబు వాసమై లీలనుండె
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి సుమతి।

సీ॥ ముఖమండపమును సమ్మోదమూరఁ గట్టించె
శివునాలయమున మాచవరమందు
నరసాపురపు పేటఁ బురహరునాలయ
మ్మున స్తంభమునుఁ బ్రతిష్ఠమెనఁ బొనర్చె
ముప్పదియేండ్లు బాగొప్పగా నలనూస
శివరాత్రి వ్రతమునుఁ జేసెభక్తి
నందివాహనము నానందంబుగా మాచ
వరపురీశునకు నర్పణముఁ జేసె।

తే॥ గీ॥ తల్లి సత్యాంబ దివికేగు తరుణమందు
రేకుచావడినొండు సంప్రీతితోడఁ
గట్ట నియమించెఁ బ్రజల సుఖంబుకొఱకు
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి సుమతి
సాధు గోపతిగామి విశాలభూమి।

సీ॥ సుతమహాని రచిత సంస్కృత భాగవతమును
రామాయణ వరపురాణములను
రేబవళ్ళను శ్రద్ధతో బఠనమ్ముచే
యించి బ్రాహ్మణులకు మంచి విందు

లొనఁగూర్చి తృప్తులై తనరిన పిమ్మట
సంభావనలిచ్చి సాగనంపు
నుర్లాము పండితులొరిఖిక నేతెంచు
వారి॥ వార్షిక పణము లొసగు॥

తే॥ గీ॥ కూతులకు వేదవిహితంబు భాతి చెలఁగి
చేసెఁ గన్యాప్రదానముల్ భానుక్రముగ
నైదు; వేయేల బోడాకులాబ్ధి శశికి
శ్రీముదప్పల నరసింహ శ్రేష్ఠి కెనయె!

సీ॥ అలమాచవరపు విశ్వాలయ స్థలిసి నం
దాదీపమిడ భూమి దానమొసఁగెఁ
బెనికేరు గ్రామ కోవెలలోన రుక్మిణీ
సత్యభామల ప్రతిష్ఠనుఁ బొనర్చె
నుభయతో ముఖిగోవు నొగిదాన మొసరించి
భూదేవులకుఁ గోర్కెఁ బూర్తిచేసె
భక్తిఁ జేయించె ముప్పదియేండ్లు ద్వాదశీ
వ్రతమైదుగురు విప్రవరులచేత!

తే॥ గీ॥ పరమశివకేశవాభేద భక్తికలిగి
దివ్యతేజోమయుండై తా దిక్కటంచు
నమ్మి చరించుచుండు గర్వమ్ము లేక
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి వసుధ॥

సీ॥ కాశి ప్రయాగ జగన్నాధ మయోధ్య
జంబుకేశ్వరము విశాలకాంచి

రామేశ్వరము గోకులఁ గయ శ్రీకాళహ
స్తియుఁ ద్రియంబకము నాసికయు, భద్రిం
గిరి, విరూపాక్షము తిరుపతి మధురహ
రిద్వారమును ఘన శ్రీగిరియును
రంగదుత్తుంగతరంగ శ్రీఁజెన్నారు
నన్య కావేరీ నదీతటంబు॥

గీ॥ నందు వెలసిన రంగనాయకునిఁ బురము
యమునాబృందావనమ్ముఁ గరమ్ము గాంచి
హృదయమానందమునఁ జెంది యేగినట్టి
తీర్థయాత్రల నదులనుతించి మించి
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి తనిసె॥

గీ॥ గ్రహణ సమయంబులందు పుష్కరములందు
సమరభాష రచించిన యట్టి భాగ
వతము, రామాయణమ్ము భారతము పూర్వ
గ్రంథ త్రితయము శ్రీనలు రాణిపేర
దానమొనరించె నిద్దియు దానమనుచు॥

సీ॥ పావనంబైన గోదావరీ తీరంబు
నందున్న కొవ్వూరు నందు నొకఁడు
కడుదయాళుండు భాగవత సప్తాహంబు
జరుపు స్వాములవారి చరణయుగళి
పూజకై బంగారు పూవులఁ జేయించి
మనసారఁ బూజించి మాన్యుఁడయ్యె

ధర్మ కార్యాను సంధాయియై తనజీవ
యాత్ర సాగింప ముందంజవేయు॥

గీ॥ కమలహితుఁడల శశియు నక్షత్ర సమితి
తమప్రభావమ్ము లెడలిన తరిసినైన
బంచ భూతాలి తమ స్వభావమ్ములుడిగి
నప్పటికిఁ గలంచునె! భక్తుడైన వీని
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠిఁ బ్రకృతి॥

తే. గీ. తనదు పేరింట మనిన మాతామహుండు
గ్రంథికుల చంద్రుఁడప్పన గామదేవు
నాలయమ్ములనుఁ గట్టింప నదియు శిథిల
మగుటఁ గట్టించె మఱల రామాలయమ్ము॥

సీ. ధరమూచనరమునఁ జరిగిన రామస
ప్తాహమందున నన్న దానమునకు
వలయు బియ్యమునిచ్చి యలరించె సుజనాళి
భళియంచు నాశీస్సు లొలయవెలుక
తొత్తరమూడిలోఁ దొలుదొత్త నప్తాహ
దినమునకగు ఖర్చు నొనరనిచ్చె
వైశాఖపూజ ముప్పదిఁయేండు లాదిగా
జేయు బ్రాహ్మణులకుఁ జిరసుఖముగ.

గీ. అంగిరస వత్సరాషాఢమందుఁ బుష్క
రమ్ముఁ గావునఁ దీర్థ విధమ్ము లెల్లఁ
జరిపి భూదాన మాది దశవిధ దాన

ధర్మములఁదీర్చి గౌతమిఁ దలఁచి పొగడి
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి తనరె.

[ పులుగుర్త వస్త్రాహమున భూదారకము ]

చ॥ సలలితరామనామ పదసారమెఱింగిన మూర్తిరాజు, భ
క్తులకకిమీఁదుచేసె సొకసూరి జయప్రసమూనవహిల్లఁగాఁ
బులుగురుతాఖ్య గ్రామమున బొల్పగుభక్తులఁగూడి రేబవ
ళ్ళల భజనమ్ము సేయఁగన లాలనుఁడైచని నైశ్యదాత ని
శ్చలుఁడగుఁగాన కుంచెనఁబి శాలపుఁబంటపొలమ్ము దానమున్
వలనుగఁగూచిమంచికుల వార్నిధి చంద్రునకిచ్చె నిమ్ముగన్॥

తే॥ గీ॥ రామకోటిని భక్తితో వ్రాసె నిరవ
దొకటి లక్షలు సకల కఁణోజ్వలుండు
నాంగిరస వత్సరాషాఢ మందు శుద్ధ
పంచమికినయ్యె నీలెక్క పరగఁజేయ॥

వ. స్వర్గము నలంకరించిన తల్లిదండ్రుల కప్పలనరసింహ శ్రేష్ఠి యొనర్చిన కర్మకాండ, దాన, ధర్మములు

తే॥ గీ॥ శోభకృతు వత్సరాంతర శుద్ధ మాఘ
ఫాల్గుణంబున పంచమి భానువార
మునను వేంకయ శ్రేష్ఠినమో! రమేశ
యంచు దివికేగెఁ బ్రజ లహాహాయనంగ॥

కం॥ ధరక్రోధన వత్సరమున
నరియగు నాశ్వయుజశుద్ధ షష్ఠిని విధువా

నరమున సత్తైమ సద్గతి
కరిగె, నిజాత్మజుఁడు సూవెయూనరు వసుటా॥

గీ॥ కర్మకాండనొనర్చెదు కాలమందు
భూమిదానంబు ముప్పగు భూసురులకు
శెంట్లునలువదియొసఁగె నాశీర్వదింపఁ
దండ్రియెడభక్తికల్గిన తనయుఁడితఁడు
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి కాన॥

తే. గీ. తల్లిఁదండ్రుల ఋణము నంతయుఁదీర్చి
యిహాపరంబుల రెండు గడింపనర్హ
డె·వడనంగ నితండె మదిన్దలంప
శ్రీమదప్పల నరసింహ శ్రేష్ఠి యాగా।

ఆ. వె. మూడుసూర్యగ్రహణముల మూడుగోదాన
ముల నొనర్చి స్వర్గమున వసించు
తల్లిఁదండ్రులందుఁ దరియింపగా, గయాశ్రా
ద్ధవర్గితములఁజేసె వాంఛితముగ.

కం. తరియించిరి తలిదండ్రులు
వరసుతుని సుకృత్యపటిమ వారిరి భాగ్యం
డిరవుగఁ బవిత్రుఁడయ్యెను
స్థిరుఁడప్పల నారసింహ శ్రేష్ఠి తలంపన్.

## —•గీతావళి•—

శ్రీరమామణి హృత్సరసిజలోలు
నమర చారణసిద్ధ విద్యాధరులునుఁ
గిన్నరులు సాధ్య పన్నగ కింపురుషులు
బూని కొలువంగ వైకుంఠపట్టణమునఁ
గొలువెసంగినవాని నేఁ గొలుచుచుండ
నన్ను రావించి యప్పల నారసింహ
శ్రేష్ఠ కవివర్య' మీరు వ్రాసిన భగీర
థీ శతక మొకసారి సంతృప్తిఁ జెంద
వినఁగ వేడుకపుట్టెనో యనఘ! యనుచుఁ
బలుక, బహుబాగటంచు నింపారఁజదువ
నాలకించియు నచ్చునకైన ధనము
నొసఁగె, నిప్పుణ్యుఁ జరితమెంతో ముదమ్ము
దోఁచి వ్రాసితి నన్నని దొసఁగులుండుఁ
గాన మన్నింపుఁడయ్యా! ప్రఖ్యాతమతులు;
పరమపూజ్యులు! నేనుఁ గొవ్వాలిసువంశ
రత్నమనియెడు వేంకట రత్నముఁ శ్రీ
సుతుఁడ వేంకట సూర్యుండ సుజనహితుఁడ.

# భగీరథీ శతకనిర్మాణ కారణము.



సీ. శ్రితజనాళికి సదోచితకోర్కె లొసగుచు
మొలకనవ్వుల మోము చెలగుదాని
దనవికస్వరనూత్న వనజాయతాక్షుల
నెనరుఁజూపులఁ జూచి తనరుదానిఁ
దన మేనుఁ గుందనంబును హసించెడు కాంతి
దిశలఁ గ్రమ్మ హొరంగుఁ దెలుపుదాని
దనయశంబును ధగద్ధగిత ధావళ్యమ్మఁ
దులఁదూగు మేల్మి దువ్వలువదాని.

తే. గీ. స్వప్నమునఁగాంచి తెఱగంటి చానగాక
పృథివి నే సతీమణులిట్టి విధముఁబొల్తు
రని వితర్కించుచున్నంత ననియె మృదుల
మధుర భావల నే భగీరథి నటంచు

తే. గీ. అంత మేల్కాంచి సవినయ మాత్రతయును
వాడమి యద్దేవిఁగన్న మహోత్సవమున
శతక మొక్కండు నామె వత్సలత తెలియ
వ్రాయ నమకట్టితిని విద్యరాని మతినిఁ
గాన, మన్నింపుడయ్య? ప్రఖ్యాతమతులు.

చ॥ నిలచెడునీడనమ్మి తరుణీమణి యెంతయు మేఁపు పెంచి పూ
తలఁ గొనరింపనైతినని దద్దయుఁ జింతయొకండు; కన్నబి
డ్డలనొక దొడ్డవానికిఁ దగఁగాలునఁ గట్టని చింతయొండు; భూ
తలమున నాయఁ జిక్కియుఁ దల్లడమొందితిఁ గా భగీరథీ!

చ॥ జగతినిఁ బుట్టినందులకు సార్థకమింతియు లేదు మాలపూ
దిగకులమందు నైననుదతీ! ననుఁ బోలిన పాపులుందు రే
వగచినఁ గార్యమేమి కనివైచిరి తల్లియుఁ దం[illegible]
సుగతినిఁ జూపి సౌఖ్యములఁ జొక్కఁగఁ జేయవదే భగీరథీ!

చ॥ ఘనతరమైన గర్భనరకంబున మ్రగ్గుచుఁ దేలఁగా నెటో
జననము వచ్చె నిద్దినము సల్పిన పాపముచే నవిద్యక
ప్పినను మఱింత దుర్గతికిఁ బిల్చుచునున్నది దేవి చిత్రమో
వనరుహ నేత్రుఁడా నృహరి భక్తి ఘటింపగదే భగీరథీ!

చ॥ ఉరగమునోటఁ జెందిన సమయోచితభంగుల సూక్తికావళిన్
గరము గ్రహింపఁ జూచు పెనుకప్పవిధంబున నాయువుండి వే
మఱు మఱి నాయనేయ వసుమానముఁ జెందదు నాయకుండు నా
నరయఁడు నాయఁ గెల్వఁగ మలాయతలోచన! శ్రీభగీరథీ!

—♦ భక్తి ♦—

చ॥ అరయు మశీతలంబన హిమాచలమగ్ని యనన్ యుగాంతమా
తరివసుఁ డంచనగ్ని వరదాయకుఁడన్న రఘూత్తముం డసుం
దరియన నీళ్; భక్తికి ననందగు వాయుతనూజుఁ డోల్కకుం
ధరసన భూమిదేవి ముదితా! యివి పేర్కొననౌ భగీరథీ

ఉ॥ పిల్లఁడు నేర్చుగర్భగుణఁ బెద్దదియౌ పరవిద్య వానికేఁ
బిల్లలుఁ బెద్దలున్ జటలు పెంచినవారలు నేర్చుకొంద్రు మేన్
జల్లునఁ బుల్కరించు మఱిజారిన బాష్పములట్టివాడు వె
జల్లిన దైవభక్తియు వెసన్ సుఖదాయకమౌ భగీరథీ!

చ॥ త్రికరణశుద్ధిగల్గి సుమతిన్ భవమోచనసేయుపొంటె తా
రొకని సన్మహాత్మునకి యోరిమిగుట్టులు వృచ్చియుందు వె
న్కకునటులాగుచుండెడు వికారపుమాయను ద్రోచి వైవరే
చకమునుఁ బూరకంబులివి సాధకముల్వినుమౌ భగీరథీ!

చ॥ అనుభవమున్న మీఁదటను ఖాసుఖముల్ తెలియంగనో భజ
వ్వనిరతిఁ గోరుగానిపసిబాలకిదేల! మదిం దలంప సా
ధనభవవార్ధి దేశ్చవను ధైర్యము మాత్రము వీడరాదు బో
ధనబహుముఖ్యమిందు గుఱి దాలనివారలకున్ భగీరథీ!

చ॥ ఎనిమిదిజాలు రోజునకు నింతిపరాత్పరుడిచ్చి యుండఁదా
నెనగున జాము లేదుకద నీమమునన్ గడియైన భక్త వ
శ్యుని మదినుంపలేగ పరిశోధనచేసిన వేలలో నొకం
డనఘుపదాబ్జసేవ నిరతాత్ముఁడు లేడుకదా భగీరథీ!

చ॥ భజనమునందు బుద్ధికలవానిని లేఖయు నాలి బిడ్డలున్
రుజయు జరాభరమ్ము నగరోఁజుటలున్ దిగదీయు ధీరుడై
రజతసువర్ణశాలల బరాకనినేవకులార్చు భోగికిన్,
భజనమెంచునే మదిని భక్తి చెలంగనిచో భగీరథీ!

చ॥ గురుఁడు మహేశ్వరుండు హరి కూరిమిబిడ్డఁడు విష్ణువున్ మనో
హరనగుణమ్ముఁ దేజము మహత్వము నాపరమాత్మ కాన స
ద్గురుని సమాన మెవ్వరతి గూఢ జగమ్ముల నట్టి చూడవు నా
మరభువి జమ్మ పోలికను మానిజశిష్యునకున్ భగీరథీ!

చ॥ నడవడి తారతమ్యముఁ దసంతనె తా గ్రహించి కాళ్ళపై
బడి మహితాత్మ దీనుఁడ గృపారహితాత్ముఁడఁ బాపరూపముం
బడితినటంచు సద్గురునిఁ బ్రార్థనచేసియుద్దూరు దేహమున్
గనుపవలెన్ దరించు నుపకారము గాంచవలెన్ భగీరథీ!

చ॥ కులముఁ బ్రాకివాఁడు తనకుంగల బందుగులెల్ల రీతిఁగన్
గులముఁ జేసియనుగు జెలికాంద్రును లేక భార్యయుం
గలిగినయట్లు సెప్పు నిగారవుగండ్లు వెసంద లోమ్ముయుం
గలపితదెంతయో ఘుమఘుమగా జగతీస్థలిలో భగీరథీ!

ఉ॥ పాతకదానవహ్నిఁ నగబాలుదహింపగ జీవితాటవున్
భీతిలి పల్లుఁ బ్రాణులు సువీరత జేరెను మిత్రినెంచి తా
రేతలిఁ దంద్రిభాగ్యపరమేశులకై మెలుగ స్త్రీయమిత్రికం
జాతసమాశ్య తోల్తం విచారము నేయకు కా భగీరథీ!

ఉ॥ ఈయుగమందు నెమ్మదిననేక మహాత్ములు పావనశ్యులై
పాయక శ్రీహరిన్ బ్రబలభక్తి సుశృంఖలఁ గట్టివైచి రం
గాయని నోరునొవ్వఁ బరసంబొనరించి తమంబు చించి ప
ద్మాయతనేత్రు సద్గతికి హాయిగ నేగిరి కా భగీరథీ!

ఉ॥ శారదచంద్రబింబము విశాల వినీల ఘనాఘనంబులన్
దూరి ప్రకాశహీనమయి తోచినకైవడి రామచంద్రుడిం
పారగ మాయచీకటుల మాటుననున్న కతమ్ము నజ్ఞులకా
వారికగోచరం బిసి ప్రభాసితకీర్తిని నీ భగీరథీ!

ఉ॥ మాటలఁజెప్పవచ్చు నుపమానకపాటలఁ బాడవచ్చుఁ గేఁ
లీస్నటుచుందంబు రానిగతి నెంచక ద్రిప్పగవచ్చుఁ దత్త్వముల్
మాటిగఁ బాడి పత్రికుచి జూడగవచ్చుఁ గపాయవస్త్రముల్
నిటుగఁ దాల్పవచ్చు గుఱి చేరరు పామరులో! భగీరథీ

ఉ॥ శాంతజనించినప్పుడె సుభాంబన దైవము పేరు పల్కరా
థాంతవు బాసుచుండు విబుధావళి జేరి వినంతు శోకపల్
గాథల నెంచుచుందు; ప్రుటికాలము చిత్తము కేంధమ్ముచే
సాధువు లెట్లొనోయతడె సత్యముఁడు నిత్యుఁడునౌ భగీరథీ!

ఉ॥ సూరఁగనూరఁగా శరమునూలొ్న నివన్నె వహించు శాంతిని
స్పారపుఁ జిత్తమైనఁ దగు సాధనచే బరమార్థమార్గముం
జేరను ద్రోవఁగాంచునని జేరఁగరాని భవాబ్ధిదాట సం
సారులకెల్ల నిద్దియ యసాధ్యపుఁగార్యము శ్రీభగీరథీ?

చ॥ అలికుల వేణి తామరపుటాకుననిల్చిన దోయమట్లు నూ
యలగని శాపురమ్మున నియామకమైవిల సిల్లుకృత్యముల్
లలిచతురత్వమేర్పడ మెలంగుచు నల్పుచు జీవయాత్ర నే
కలుషవిదారి నల్పెనో జగన్నుతుఁ డాతఁడె నూ భగీరథీ!

చ॥ ప్రవిమలదీపమున్నపుడె ప్రాపగు వస్తువెఱుంగఁజెల్లు నా
గవెకడ తేఁగనంతమన తెల్పియు నేమియు సేయలేము; మా
ధవుపదభక్తియబ్బనగదా! యల "తెల్ల్యకడానిబొమ్మ" చం
ద్రవదన నూఁపురమ్యము ప్రధానప్రదేశము శ్రీభగీరథీ!

చ॥ కడచినజన్మలెన్నొ యికఁ గాఁగలవెన్నొ జలమ్ము వాయువుం
బుకఁగుని సంచరించు కిమిపుష్పాలఁ బుట్టితి మెన్ని మాఱులో
మడఁగిన వెన్నియో తెలియ మాన్యులు తేరలక ర్మబీజముల్
ముడిచిన నీజన్మజన్మలకు మొలకల నెత్తుసుమీ భగీరథీ!

చ॥ తెలుఁగనికర్మబీజసముదాయము చచ్చినఁ గాని యోరికిన్
ముఱికిఁ బుట్టుటల్ మొనలఁబోవవు పోయినగాని మోక్షసం
దళితకళాభిమానకము సమదానవిరాజితా! జన్మజన్మకున్
మఱిమఱిసాధనమ్మును మార్గము సిక్కమిదే భగీరథీ!

ఉ॥ ఎత్తిన జన్మలన్నిటఁ దరించుటకై మననించుఁవాడు కిం
చిత్తుగుణంబు జన్మల విశేషముఁ గాంచు నిదే విధమ్ము గా
రిత్తయువోక నాకసు దఁ...ద్రుడు విశ్వవహించుఁ బాపికిం
బత్తిజనించుఁ జేయుచవి వట్టివియై చనునా భగీరథీ!

చ॥ ఇనిమనమెన్న లేక నుతియింతుము కుమ్మరిఁ నాదుకన్న సో
రదుఁడనువాఁడు కోటికవరాబమెఁ గొల్లుఁగలాఁడుగంటకై
వెదకు గొకప్పులివ్వకను వేదురుఁజింతయుఁ గూర్చుఁగ శ్రీసా
రథియనుచంచు నెంచెద నిరంతరమున్ మదిలో భగీరథీ!

ఉ॥ బాలుని(బోల్తై( బిచ్చికలవానిసి కైవశీదయ్యాముని బలెన్
గాలము(ద్రోయు గాంచుచు జగమ్ము మనమిథ్యగ జ్ఞానినన్న గా
జాలము యాంతదెప్పు బగ సమ్ములు నల్కుడు పొట్టకూటికై
చాలదటంచు( జేయుతెగనాచడు సాదుగదే భగీరథీ?

ఉ॥ మీఅందు గుహ్యనాజ్ఞ నతి మేలని తృప్తిపడంతు, గుట్టుగా
నీఉనదాగినట్టి యొక నిష్ఫ్రక్రియ జరియించు(దాల్మినై
బాలునిమాలనిన్ సమతభావమునం దలపోయుచుంతు;నీ
తెలుప జ్ఞానియుండు జగతిన్ గణియింపడుగా భగీరథీ!

చ॥ గుణరహితుండుగా (బరచకోరమిలోచన( దలిక్రైనిన్
గణనము సేయుచుండు గుణశాలము(గిమ్ముకు గట్టనేర్చినా
ఫణిపతిశాయికీర్తనలు పాడుసతమ్ము జితేంద్రియుండు స
ర్వణమునొసర్చి సర్వము( గృపానిధి జ్ఞానియగున్ భగీరథీ

ఉ॥ సాధువులైనవారు మనసార(గ నొక్కటి వల్కునంతలో
బోధయు సేమమంగలుగు బుణ్యులకుం గుణనాళికద్దినో
బాధయొనర్చు నయ్యది ద్విపాదపశుల్ కననేర్తురే! సదా
సాధుల వాక్యముల్గులుల జక్కనిరత్నములన్ భగీరథీ.

చ॥ గురుకులవాసులున్ మునులు కూడి మెకల్గినవారు వాయువుల్
తిరముగనిచ్చవచ్చినగతిన్ మరలించెడువారు భుక్తి సం
హరణము సేయువారు హరినామయుత్రోవ నెటిగి మెల్లగా
నరిగిరి కాని, దారిఇది యంచనరైరె వెనన్ భగీరథీ'

చ॥ వసుమతి నివ్వలేని బుధవర్యులు వంచిన భక్తి నేని యు
భ్యసనమువల్ల నేని కలిపాలుని జూడకపోరు, వింటివా
పసితనమందె పాపఁడు కృపానిధి శ్రీనరసింహమూర్తితో
రస మొలుకంగఁ బల్కుట సరాసరినుండుటనో భగీరథీ!

చ॥ అకలుషబుద్ధిశాలులు దయామయులైన రమాహృదీశు భ
క్తికి నిధులై శరీరయువతీరతులందు విరక్తులై చలో
క్తికి నుడులాలకించుచు నుతించుచు వెల్గుల వెక్కిరించు పో
లికఁ గనుపట్టి సద్గతిఁ దరించి రనేకులు శ్రీభగీరథీ

చ॥ జగతికిపిచ్చివారు నిజ జాయకునంతకు మున్నె పిచ్చి, లో
తు గడదలించి చూచిన నధోగతి మాటలపిచ్చి పైపయిన్
జగతిఁ దృణీకరించు నొక చక్కనిపిచ్చియుఁ గల్గినట్టి భ
ద్రగులె మహానుభావులని తప్పకనమ్మెద శ్రీభగీరథీ

ఉ॥ కీరమనోజ్ఞవాణి తిలకింపుము, భక్తికి ముక్తికిన్ సదా
ధారము దైవసేవ విధాయకమౌకద! రెప్పపాటు శృం
గారపు స్వప్నమిద్ది; కనుగవ్వ నటించెదనమ్మ నీకు, సం
సారపు మాయ; దీనఁ గృపిసల్పఁ బ్రమాదముగా భగీరథీ!

చ॥ అడవులనున్న నేమి మఱి యాకుల దుంపల దిన్న నేమి! ద
మ్మిడియుఁ గడింపలేమి తనుఁ గ్రుంగిన నేమి! జటాభరమ్ము పై
బడి మతిబోవువానిగతి వచ్చిన నేమి దిగంబరుండునై
పుడమిఁ బరున్న నేమి సరిపోరు వరుణ మునికిన్ భగీరథీ

చ॥ అరసినతత్త్వవేత్తలు భయంబకరింతయుమృత్యువన్న వే
గిరపడి తొట్రుపాటుఁగలిగింపరు తోడజరించు వారిఁదా
రరిగెడుఁద్రోవజూతురిహమందున బంధముద్రోసియంతలో
గురుఁనుపదేశపద్ధతికిఁ గూర్తురిమనమ్ములు శ్రీభగీరథీ!

ఉ॥ లేనెల తాల్పునాజ్ఞ లవలేశము లేనిది చీమయైనఁ దా
నేనని సేయుఁబట్టి దినుహీనస్థలిలేదని చెప్పువార్తల
జ్ఞానినహించుఁగాని గురుసన్నిధి మూలము నేర్చినట్టి, సు
జ్ఞానిసహించునే ? తికి జాలిందేవియనున్ భగీరథీ!

ఉ॥ వేలకొలందిజన్మలు భుజించననంబయుపోయి, తల్లులం
జాలగదుఃఖపెట్టి కడసారికి మానుషజన్మమొందినా
మోలలితాంగి మందుభవమున్నకానియదిట్టి ? నే యే
లీలనో! యిట్టిజన్మని తరించవలెఁ దమిఁగన భగీరథీ!

— వైరాగ్యము —

చ॥ మలమలమండు వేసఁగిని మార్గవశంబునఁ బోవుమానవుం
డలమృగతృష్ణఁగాంచి జలమబ్బెనటంచు నుదంబుఁజెంది యా
వలవృథయాట ద్రిమ్మఁబడెడు వానితెఱంగునమాయపల్లవో
ష్ఠులరతిఁగోరదుర్భ్రమయ చూడఁగజాడఁగనో భగీరథీ!

చ॥ మెసవుట నిద్రవోవుట రమించుటయున్ బ్రతిజీవరాశికిన్
వ్యసనమకాని తన్నెఱుఁదనునారయఁజింతగొనుంగొండు లేదు సొ
క్కనమగు నీ ... త్రితయ కాంతుననుభోగవిలోలవృత్తి మై
మసలుచుఁ దాను సద్గతికి మార్గముఁ గోరదుగా భగీరథీ!

చ॥ బ్రతుకిది లెస్స కాదు శలభంబు మహోజ్జ్వల దీపికాగ్నిలో
మృతమగు మాడ్కి జీవుడు శమింపగ రానియవిద్య మెచ్చిలో
హితవు ఘనీభవించి తుదిహీయుని యేన్చు; సుకర్మబద్ధుడౌ
నతడు సదాసుఖించు ఘనమై తనజన్మ చనన్ భగీరథీ!

చ॥ జననిమహోదరంబున విచారము వెల్వడినంత పోయి, కా
వనియుపయోడ్చి మాయను జివాళులఁ జేసదాకర్మ సం
జనితపదార్థజాల నిమనంబు సిపోక సుఖాపుఖంబు దా
ననుభవమందు లోకము లీయూద యిదే కనుమా! భగీరథీ!

చ॥ ప్రభల మనోనిదానము కరంబు నెనుంబుద మంబహింసయున్
త్రిభువన మోహనంబగు సతీజన జైత్రము లివ్వి నూనవా
లి భయహారంబు జేసియు వెలింగెనుసర్వమయు ప్రభుం సదా
రభసముతోడఁ జేర్పగల రమ్యపు మార్గము లౌ భగీరథీ!

ఉ॥ కోవిదుడైనఁ బుష్పశర కోముఁడైనఁ బలింపి యూమెలన్
రేవగలూఁగు వాఁడయిన ప్రేమను దూలిక పాన్పుపైని దా
రీవిఁబవుండు వాడయిన రేవను నెంతో బలాఢ్యుడైన, హా!
చావునతిక్రమింపఁడు; కృశానునిఁ జేరుఁడు కన్ భగీరథీ!

చ॥ తృణగతి నెన్నలేని తనకై పిపిధాన్నములఁ బానమున్ వధూ
మణి మెలజవ్వనమ్ము సుకుమారము వడ్డికి వడ్డి పెంచుటల్
గణనము లేని కోర్కులు సుఖాస్పదముల్ తనుదాచుకొంట ల
ర్వాణమున కేల చింత! కనరాదిది గారడి, యో! భగీరథీ!

చ॥ సితపరపుష్పగాత్ర! యరిఁజిక్కినఁబెక్కువిధమ్ముగాకులుం
బి, తెలుపుఁగానరాక శ్రుతిమీఱినబిమ్మిటగాగవాగతిన్
బ్రతుకునమాప్తికాలము జవమ్మునరాఁగనువిచ్చియోజగ
త్పతి! యనిగ్రుద్దుకున్నపుడు పాయిదయేమిటికిన్ భగీరథీ!

—♦ కర్మ ♦—

ఉ॥ చక్కనిచుక్కయైన గుణశాలిని కింపగు భర్తరాఁడు పెం
పెక్కినవంశజుండును రతీశుడనన్ దగు వన్నెగానికిన్
దక్కఁడు భార్య; భాగ్యనిని ధానముచేయును పేదవానికిన్
బెక్కురు పిల్లలుందు రవివేకపు సృష్టికదే భగీరథీ!

ఉ। నీరులికంపుపోవ నతినేర్పునఁ బుప్పొడిజల్లి చందనా
సారములోనముంచి ఘన సారముఁగూర్చిన దుష్టవాసనా
ధోరణిమాన్పలేరు మదదూషితదుర్జనచిత్తమార్గముల్
సారసగర్భుఁడాతనికిఁ జక్కయొనర్పఁడు శ్రీభగీరథీ!

ఉ॥ తొల్లిటిజన్మవాసనలతోడ లభించి గుణోత్తమంబు తా
నెల్లవిధంబుల న్బరఁబదేర్చి ఫలంబొనరించు భక్తులన్
బొల్లులఁబల్కు తద్దుదర పోషకులెల్లు సమర్థులౌదు రు,
ద్యల్లలితింపువీణకెనయా! వినుపంబము శ్రీభగీరథీ!

—♦ ఇతరవిషయములు ♦—

చ। బలిమిగజమ్ములైనఁ బువ్వుబంతివిధమ్మున నెత్తవచ్చుఁ జే
రలనవలమ్ము పేడ్కఁగొని రానగు; నన్యప్రదేశవార్త ని
శ్చలపువనః ప్రభావమునఁ జక్కఁగనారయవచ్చుఁ గానిచె
ల్వాల యెడమర్మమున్ దెలియువారలునుందురె! శ్రీభగీరథీ!

చ॥ నరునకు దైవభక్తి కదనంబున సేనకు ధైర్యశక్తి! భూ
సురునకు తర్కయుక్తి; నృపసూనున కెంతొ ప్రజానురక్తి వా
గ్విరచనశక్తి పండితకవీశునకున్ బహుభక్తి పల్లవా
ధరకు నివే ప్రశస్తములు దారగుణాన్విత శ్రీభగీరధీ!

ఉ॥ మేతకరీంద్రమట్లు కడుమేయును నిద్దుర కుంభకర్ణుడో
రీతుగ నిద్దురించు విహరించును గార్ధభమట్లుఁ; పెద్దగా
బూతుల రేగుఁ పెద్దలకు బుద్ధులుసెప్పఁగడంగు దైవమున్
దీశసికింపు లేదు మఱి యేగతిమూర్ఖునకో భగీరధీ!

ఉ॥ కాయలుబండ్లు మంపలును గమ్మని రుచ్యవుదీవ మొల్లలున్
వేయివిధమ్ములుండ సకవిన్నను చుండెడి నిండుప్రాణులన్
గోయుచునుండ్రు గాని తమకున్ మఱి గ్రుచ్చుకొనంగ నెత్తిపై
వాయఁగఁగొట్టుకొంద్రు తమవంటి వివేకయవిద్యులా భగీరధీ!

ఉ॥ స్నానము హోమము న్గపటసంధ్యయు బూడిదపూత లెన్నవి
జ్ఞానవిహీనమౌ నెడప్రశస్తము! మోక్షము నిచ్చి మెచ్చునే
ధ్యానములివ్వి కావు; మనుతెలివి జ్ఞానము లోచనంబులన్
మానిని' కన్నఁగిప్పుడు రమాపతికష్టమిదే భగీరధీ!

చ॥ తరుణికి జవ్వనమ్ము జడదారికి శాంతము తీపిపేటికిన్
స్పరికలవానికీవి; కరుణింపుట తేనికి; గుబ్బచంటికిన్
సరియగు రైక; చిల్కకు బనందగు పల్కు రవంత పూవు వం
బరినుళయున్న నే యవినుమా గణుతింపబడున్ భగీరధీ!

ఉ॥ తియ్యనలేనినీరు కళతేల్పనికూటమి సూనృతమ్ము రా
నియ్యనినోరు, మంచిరమణీమణిలేని గృహమ్ము వేగుణం
బియ్యనిమందు, లక్ష్యమువహింపగలేని జపమ్ము లెన్నగా
వ్రయ్యనిదాడిమీఫలము వైఖరియుగా వృథయే భగీరథీ!

చ। గురుడుతరింపఁజెప్పు, దనుగూడుతమంబుల నెల్లఁ రొప్పు పా
పరతుల మానసమ్ములఁ గృపామతిఁ ద్రిప్పు, విచారసాగరో
త్తరణకుయుక్తి మప్పు; బరదారధనాదులఁ గోరుతప్పు న
త్స్వరమునవిప్పు నిద్దియ యదార్థము పావని? శ్రీభగీరథీ!

చ। నడవడితారతమ్యముఁ దనంతనె తాను గ్రహించి కాళ్ళపై
బడి మహితాత్మ! దీనుఁడ కృపారహితాత్ముఁడ బాపరూపముం
బడితిననటంచు సద్గురునిఁ బ్రార్థనచేసియు స్వార్థదేహమున్
గడుపవలెన్ దరించు నుపకారముఁ గాంచవలెన్ భగీరథీ

ఉ॥ ఆకలిఁ దీర్చుకొంటఁ ద్రుటియైననుదాటగనీదు నిద్రను
స్వీకనదల్పలేదు రతివిభ్రమముం దొలగింపఁ జోను వి
ద్యాకలనంబుచేయ షితడాహరినైన మదిందలంప డిం
దేకమలాక్షి కుక్షిచెడ నెట్లుదయించెనొకో భగీరథీ!

చ। అభిరతిఁ దీర్ఘయాత్రల ననారతమేగినఁ గాశికాపురీ
విభవముఁ గొన్నియేండ్లనుభవించినఁ బంచవడాననాన్వితా
రభటివహించు రుద్రునివరాక్షులు శైవఫలమ్ము లేదు. కై
టభమదహారి గాంచగ నెడందఁదలంపరుకా భగీరథీ!

ఉ॥ కొందరు రాళ్ళపూజ మరి కొందరు బావులఁ గొందరగ్నినిన్
గొందరు నీచదేవతలఁ గొందరు చెప్పఁగరాని వాటినిన్
గొందరు మంటిలింగములఁ గొందరు కోమలగాత్రలన్ సదా
గందరగోళమైనగతిగా భజియింతురు గాదె భగీరథీ!

ఉ॥ కట్టలఁ జెక్కి కొందఱు చొక్కావపు బొమ్మల జీవజంతులన్
అట్టులు సాధి ద్రమ్మెక్కి ఫలహారము లెన్నియొ మెక్కుచుందు రా
దట్టము గాలఁ బూతురిక దేవుఁడెవండో యెఱుంగలేరు, ము
వ్వట్టులు లేనివాఁడు కనవచ్చునె కన్నులనే భగీరథీ!

ఆకసమెంత దూరమొ హిమాచల మెంత టెత్తో సూర్యబిం
దాకట కెంత దవ్వొ గురుతారలకెచ్చటి కంతియున్న దో
వ్యాకులమింత లేకఁ దెలియంగను సూత్రము నేర్చినట్లు ని
క్ష్వాకుకులాగ్రగణ్యుఁగను పద్ధతియుండునుగా భగీరథీ!

—♦ నవఖండయోగము ♦—

చ॥ వినికనిపట్టి దొక్కటి నవీనపుఁ బుఱ్ఱల వెల్లడింతు, నా
చినతనమందు వింటకు విచిత్రపు బానసెలుంగు యోగి ఖం
డనముగ రీతి వాని చరణంబులుఁ గంఠము వీడియుంకి, వే
న్కనుఁ దెలవారినంతటఁ దనంతనె తాఁ దిరిగెన్ భగీరథీ!

—♦ ప్రాణాయామము ♦—

ఉ॥ ఊతఁడెయొక్కనాఁడు జన్మలెవ్వరు లేని విశేషవింతగా
భూతలమున్ దొలంగి, రవి పోలిక బింబముఁ జిరింపఁగంటి నే
భీకరుఁ గన్నేత్రకని పెంచెనొ విద్యావంతు నేర్చెనో
రాతిరియుమ్మెయిఁ గాని, కని రా! పగలైన, ఇనల్ భగీరథీ!

### —♦ లంబికాయోగము ♦—

ఉ॥ లంబికయోగ మెంచితిను లాలసులై వెయియేండ్లు తాపసుల్
గుంభనగా నటింతురని క్రొందఱు సెప్పఁగ వింటు; వారిలో
నంబవాలు యోగవేత్తలనినన్ గొదవేమిటి ముక్తికింక లో
కంబున ముందుగల్గు న వికారము జన్మము శ్రీభగీరథీ!

### —♦ తాపసి ♦—

చ॥ తపమున దివ్యదృష్టి యుగఁధర్మము జీవుని రాకపోకలున్
ద్రిపురవిజేతనుంగనుట తీవ్రమనోబల వాక్పటుత్వముల్
సిఫ్రుణతివిద్యలన్నిట వనేచర భూచర ఖేచరంబులం
దపుడగ్రహించుఁ దాపసి స్వహస్తగతంబుగనో భగీరథీ!

### —♦ రాజఋషి ♦—

ఉ॥ శాంతియు ధర్మముల్ ప్రబలకారణమై మనుజాళిజీవితం
బంతయునీటఁగల్పు బలమైన మనమ్ముల దల్పుజాల రే
కాంత మునందునుండియ చలాత్ములఁ గామినిహేమహేయులై
శాంతులు దాంతులయ్యు మనజాలిరి రాజఋషుల్ భగీరథీ!

### —♦ ధనాంధత్వము ♦—

చ॥ చెలువగు మేడలందున వశీకరమంత్రములట్లఁ జూచు కాం
తలు పరిచర్యఁ జేయ మృదుతల్పమునొందు ధనాంధుడెన్నడున్
దలపడు పేదవానివెతఁ దల్లిని బాసి చరించు మేక పి
ల్లలపయిఁ బ్రేమఁజూపి, వులి లాలనసేయునె శ్రీభగీరథీ!

—♦ పదార్థవిజ్ఞానము ♦—

చ॥ మధురము దేహధారికిఁ బ్రగమంబునఁ గీడుఘటీభవించి త
న్నధమునిఁ జేయుఁ జేదుఁదిననంతయు మేలునొసంగి వెండియున్
నధికునిఁ జేయునట్లుఁ బరమాత్ముఁడు విశ్వరుచింప దేహికిన్
బృథివిని మాయనుంచి దవివేకినిప్పు మనూ భగీరథీ!

—♦ నైజము ♦—

ఉ॥ కాఁచినపంతువెన్నల చికాకగుఁ బాంధునకున్ సుఖింతగా
బూఁచినచంపకాళిదరిఁ బోవనసహ్యము బంభగాలికిన్
ఆఁచనివాఁడుఁ గన్నఁబ్రబలమూనలమానలమానికన్నఁగా
దాఁచనిమోతువిద్యయుఁబఁదండగుఁ బాపునకున్ భగీరథీ!

—♦ జన్మసార్థకము ♦—

చ॥ జగతిఁదలంచిచూడ నరజన్మము పెద్దగఁ జెప్పకొంటకి
మ్మగసుకృతమ్ముదుష్కృతము మందుగనుంగొనుశక్తియున్న
భాతిగనిత్తరమ్ములందుయువతీ! కనమక్కతినన్నరుండు చె
ల్వగభవవార్ధిఁ దేలుటకు పొంప్పను దాఁటిగఁసున్ భగీరథీ!

—♦ ఆశ ♦—

ఉ॥ ఆసకలన్నినాళ్ళుహృదయమ్మునకున్ స్వతగొల్పుచుండుదా
నాసహరింపఁజేసిన ననాకతనమ్మున సుఖమందు మానవుం
డాసననేకులిద్ధరఁ బ్రయానమునొందరె తొల్లిసజ్జనో
ల్లాసకరీ! నుఱుంబిడదలఁపఁగ లేదుకదే భగీరథీ!

—• చెలిమి •—

చ॥ చెలిమిగడింపనద్దియు వశీకరమంత్ర మరణ్యవాసుడై
కొలగిననేమి! యచ్చటని మేలొనగూడును; ప్రాణదానమున్
గలుగునొకప్డు దుర్దశజగమ్మునఁ గ్రొత్తగఁబుట్టినన్న కే
చెలిమి హరింపఁజేయునది చెప్పెడిదేమిటికిన్ భగీరథీ!

చ॥ చెడిన నకుండుచెల్మిబలుఁ జేరగ రావనిఁ జెల్మికాని నిం
గడువడిఁ జేసుసుంచనెడు కైవడి విందుముకాన నిద్దఱా
కడుపునఁబుట్టినప్పటికిఁ గంజవిలోచన! చెల్లికంటె నే
స్తుఁడుఁగడుమేలుచూడు కలిచోద్యములిట్టివె శ్రీభగీరథీ

—* తారకమంత్రము *—

ఉ॥ తారకవిద్యగొప్పదికదా! తరువాతనుహేమవిద్య కా
దా! రహినాలకింపుమిక తక్కినవిద్యలజోలిమేల శృం
గారపుఁబొట్టనింపుటకుగా భువినున్న వశీకవిద్యలో
సారసనేత్ర! తొంటిదగు సాధనమించిది శ్రీభగీరథీ

ఉ॥ తారకపూంజనేయుఁను మొదల్కలవారలనేకులూహాలిం
పారగనేర్చి రెంతపనివారొకో! జన్మ పవిత్రమగుట కా
ధారము వేఱొకండుఁగలదా! తలపిమ్మిక వారిపాదముల్
కోరి భజింతు నెల్లపుడు కోమలరూపిణి! శ్రీ భగీరథీ!

ఉ॥ ఈయుగమందు నెమ్మన ననేక మహాత్ములు పారవశ్యులై
పాయక శ్రీహరిన్ ప్రబలభక్తి సుశృంఖలఁగట్టివైచి రం
గాయుని నోరునొవ్వఁ బఠనమ్మొనరించి తపంబుచించి ప
ద్మాయతనేత్ర! సద్గతికిహాయిగ నేగిరికా భగీరథీ!

చ॥ చికురవినిందితాళీ! దయచేసి కలన్ సనుధన్యఁ జేసి శీ
వికఁ దరియించినాఁడ భువినంతటిపుణ్యుఁడనో కదమ్మ! పా
యక వినుఁ గొల్చువారలకిహమ్ముఁ బరమ్మునుఁ గల్గుబుద్ధి న
మ్మకముగఁ గొంగుబంగరను మా! భవదర్చన శ్రీభగీరథీ!

చ॥ పరికరహీనుఁడయ్యు నలపైడి కిరీటము సేయఁ బూను పా
మరుని విధాన నల్పమగు పాండితి నీశతకంబు వ్రాసితిన్
గరుణ వహించి యొప్పులను గైకొనునట్లొనరించు భారమున్
దొరగ ధరించి యుందరికిఁ దోడగు మమ్మరో శ్రీభగీరథీ

చ॥ తినుటకనేకమున్న రుచిఁ దేల్చెదు పాకములుండునట్లు భా
వించు మనుజాళి హృజ్జలజవీథుల వేదనియింపఁ జేయు నె
వ్వాఁడగు; భక్తిముఖ్యమగు వాక్యమొకండును జాలదే! జగ
జ్జని! సరస్వతీగతిని సాయముఁ జేసిననో భగీరథీ!

చ॥ తెలిసినవానిఁ బోలె వెనుదీయక వ్రాసితిఁ గొన్ని చోట్ల! ద
ప్పులు వొడసూపునవ్వి పనిఁ బూని విమర్శన సేయువప్పు డొ
ప్పులుగ మనమ్మునెంచుఁ గవిపోషణముల్ కనుఁగొంటఁ గష్టమౌ
లలన! క్రమంబుఁ దప్పుట విలాసము కాదుకదా! భగీరథీ

చ॥ కరవపురమ్మున న్వెలసి కామితముల్ నెరవేర్చి భక్తత
త్పరులను కన్నబిడ్డలవిధమ్మున నెయ్యముఁ జూపి కాచి బం
గరునుమతమ్మ రేకుల నిగారపుఁ గన్గవ చూపులొల్క భా
స్వరమగు గద్దియన్ గొలువు వెనంగివనిన్ గొలుతున్ భగీరథీ!

చ॥ చలనములేనిభక్తిని విశాలయశోంబరధారిణీ! భవ
త్సలలితపాదపద్మములఁ సాగిలి మ్రొక్కుచు మెంచి చంపకో
త్పలనుమమాలికాశతముఁ ద్వత్కృపఁగూర్చితినందుకొమ్ము శ్రీ
యలికులవేణి! యీశ్వరి! కృపామృతమీయఁగ దేభగీరథీ!

—* మత్తేభమాలిక *—

సతమున్ నీరదరమ్యదేహుని మనోజ్ఞవ్యాప్తిహృద్వీధులం
దతిభక్తిన్ దనివారనిల్పుకొను భక్తాళుల్ ప్రమోదాత్ములై
శతకమ్మున్ బరిపూర్ణతన్ జదివి రాజద్రాజహంసంబు లు
ద్ధతినీరమ్మున బాలుఁ గ్రావు విధమందంబౌ పదార్థంబు తే
మతినొప్పారఁగ స్వీకరించు తె!నంబా! చెప్పఁగైశన్ భువిన్

సీ॥ వరకాశ్యపాఖ్య పావనమౌని గోత్ర ప
విత్రుండా ఖ్యుఁడు యశోవిభవుండనఁగ
ఖ్యాతినెనరాని లౌకికపాండితియు నెచ్చి
నాఁడు దుర్నదులకై పోఁడనంగ
పరధనదారాదు లరివర్గముగ నెంచి
నిరతమీశ్వరభక్తి నింపునఁగ
తనసతి మెలప్రాయమునను వదలితేఁగ
నియతిబిడ్డల బెంప నేర్చువనఁగ॥

వసుధ నలరారి చనిన కొవ్వలినువంశ
రత్నమనియెడు వేంకటరత్నమంత్రి
మానవతి బాపనమాంబల కేవసుంగు
సుతుఁడ వేంకటసూర్యుడ సుజనహితుఁడ।

మంగళ మబ్జసుగంధికి
మంగళ మమృతాంశుముఖికి మాగుణమణికిన్
మంగళము మాభగీరథి
ంగజ జనకాదినుతకు నగుమంగళముల్।

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము.

